శ్రీరామకృష్ణ
సాహిత్యము



శుభమస్తు.

# శ్రీరామకృష్ణ నామస్తవము.



డోన్ తాలూకా

వెల్దుర్తిలో. ఉండిన

S. వెంకప్ప గారిచే రచియింపంబడి

వారిశిష్యులచే ప్రచురింపంబడియె.

కర్నూలు.

చంద్రమౌళీశ్వర ముద్రాక్షర శాలయందు

ముద్రింపంబడియె.

1912.

శ్రీరస్తు.

శ్రీరాములు.

# రామకృష్ణ నామసవము.

(ఇష్టదైవముల ప్రార్థన.)

శ్రీగణాధీశయా, శ్రితజనపోష,
ోగములవారాకిమ్ము, బుధజనస్తుత్యా.

స్వతి మతిమాకు, చాలంగనిమ్ము,
క్షించిమమ్మేలు, కలికిభ్రమరాంబ.

శ్రీపార్వతీనాథ, శ్రీశంకరేశ,
•పాలిదైవంబ, నన్నుగసిప్రోపు.

౮. ధరనిమించుమతివంత, తతశౌర్యవంత,
విఠవిగ మమ్మేలు, వీరహనుమంత.

నవగ్రహస్తుతి.

కందపద్యము.

క॥ రవిశశికుజ బుధసురగురు।
కవిమందత మద్వ్యజులకు క్రమమొప్పనదా।
నవిరళభక్తిని మ్రొక్కెద।
భువనంబున నమితకీర్తి బొందుటకొఱకై॥

ద్విపదలు.

శ్రీరామరఘురామ, శృంగారరామ,
౧. వారిజధరరామ. వైకుంఠరామ,
గురువరశ్రీరామ, గురుదత్తరామ.

౨. నిరుపమ జయరామ, నిర్మలరామ,
సారసుందర రామ, సత్కీర్తి రామ.

౩. నారదనుత రామ, నరహరి రామ,
చారువిక్రమ రామ, సర్వజ్ఞ రామ.

౪. భూరిసాహస రామ, భూపాల రామ,
శరధిబంధన రామ, శశిముఖ రామ.

౫. శరచాపధర రామ, శాశ్వత రామ,
సరసిజోదర రామ, సర్వేశ రామ.

౬. కరిరాజనుత రామ, కౌసల్య రామ,
పరమపావన రామ, పరమాత్మ రామ.

౭. భరతపూర్వజ రామ, భద్రాద్రి రామ,
పరహితమతి రామ. [illegible]

౮. కరకులాంతక రామ, కరిపాల రామ,
లోకపాలన రామ, లోకేశ రామ.

౯. నాకవర్ణిత రామ, నళినాక్ష రామ.
వేంకటేశ్వర రామ, వేదాంత రామ.

౧౦. సంకటహార రామ, కౌసల్య రామ,
ముక్తిదాయక రామ, మునినుత రామ.

౧౧. భక్తవత్సల రామ, భార్గవ రామ,
శివసఖహారి రామ, సీతాభి రామ.

౧౨. భవహార శ్రీ రామ, భాస్కర రామ,
రవికులోత్తమ రామ, రఘువీర రామ.

౧౩. సవనపోషణ రామ, సచ్చరిత్ర రామ,
వాలిమర్దన రామ, వరదాయి రామ.

౧౪. శూలిసన్నుతరామ, సువిహారరామ,
వాసవార్చితరామ, వనమాలిరామ.

౧౫. వ్యాసపూజితరామ, వామనరామ,
యాగరక్షకరామ, యజ్ఞేశరామ.

౧౬. ఆగమనుతరామ, యచ్యుతరామ,
దనుజమర్దనరామ, దశరథరామ.

౧౭. హనుమదర్చితరామ, యాదిత్యరామ,
జానకీపతిరామ, జగదేకరామ.

౧౮. దీనపాలకరామ, ధీమణిరామ,
అజముఖనుతరామ, యవ్యయరామ.

౧౯. సుజనజీవనరామ, సురవరరామ,
రామహేమదుకూల, రామసుశీల.

౨౦. రామదీనశరణ్యా, రామసత్పుణ్యా,
రామదుర్గశభంగ, రామశుభాంగ.

౨౧. రామపూర్ణానంద, రామముకుంద,
రామమేఘశ్యామ, రామసునామ.

౨౨. రామరాఘవరామ, రామశ్రీరామ,
రామశ్రీధరరామ, రామేశరామ,

౨౩. రామదైత్యవిరామ, రామోపరామ,
రామశ్రీశివరామ, రామాభిరామ.

౨౪. రామసద్గుణరామ, రామమారామ.
రామశ్రీజయరామ, రామైకరామ.

౨౫. రామతారకరామ, రామాంతరామ,
రామశ్రీహరిరామ, రామాదిరామ.

౧౬. రామ శ్రీరఘురామ, రామాయరామ,
రామ సీతారామ, రామ హాహారామ.

౧౭. రామరామయటంచు, రమ్యంబుతోడ.

౧౦౮. నూటయెనిమిదిమార్లు, నోరారదమదిని,
పాటించి చదివిన, పాపముల్ బాయు,
నిన్ను సంస్తుతింప, నేనెంతవాడ,
నన్ను రక్షింపవే, నాపాలిరామ.

ఇతి శ్రీరామ నామస్తవము
సంపూర్ణము.



# శ్రీకృష్ణనామస్తవము ద్విపదకావ్యము.

శ్రీద్వారకాకృష్ణ, శ్రీధరకృష్ణ

౧. విద్యాదర్చితకృష్ణ, విధుముఖకృష్ణ.
ఇందిరాపతికృష్ణ, ఇభనుతకృష్ణ.

౨. సుందరాకృతికృష్ణ, శుభకరకృష్ణ.
మందరధరకృష్ణ, మహనీయకృష్ణ.

3. నందనందనకృష్ణ, నరవరకృష్ణ.
ఆదిమూలమకృష్ణ,యనఘశ్రీకృష్ణ.

౪. మేదినీపతికృష్ణ, మృదుభావకృష్ణ.
యదుకులోద్భవకృష్ణ, యాదవకృష్ణ.

౫. విదురవందితకృష్ణ, విశ్వేశకృష్ణ.
కంసమర్ధనకృష్ణ, కమలాక్షకృష్ణ.

౬. శంశితగుణాకృష్ణ, సఫలశ్రీకృష్ణ.
వసుదేవసుతకృష్ణ. వసుధీశకృష్ణ.

౭. అసమాకృతీకృష్ణ, యభినవకృష్ణ.
అష్టమహిషీకృష్ణ, యాద్యశ్రీకృష్ణ.

౮. సృష్టికారణకృష్ణ, సిరిగలకృష్ణ.
ముచుకుందనుతకృష్ణ, మునివరకృష్ణ

౯. సుచతురనుతకృష్ణ, శుకనుతకృష్ణ.
దేవకీసుతకృష్ణ, దేవవారికృష్ణ.

౧౦. పావనశుభకృష్ణ, పరిపూర్ణకృష్ణ.
నవనీతరతకృష్ణ, నగధరకృష్ణ.

౧౧. భవభయహరకృష్ణ, పాహిశ్రీకృష్ణ.
శకటభంజనకృష్ణ, శేషాహికృష్ణ.

౧౨. బకవిదారణకృష్ణ, భవ్యాంగకృష్ణ.
అక్రూరనుతకృష్ణ, యానందకృష్ణ.

౧౩. శక్రసన్నుతకృష్ణ, నత్యాంగకృష్ణ.
రుక్మిణీపతికృష్ణ, రూపాంగకృష్ణ.

౧౪. రుక్మభూషితకృష్ణ, రుచిరాంగకృష్ణ.
భగ్నశాత్రవకృష్ణ, బలినుతకృష్ణ.

౧౫. అగ్నిభక్షణకృష్ణ. యసురారికృష్ణ.
యజ్ఞభోక్తృవుకృష్ణ, యాగేశకృష్ణ.

౧౬. యజ్ఞరూపుడకృష్ణ, యచలాత్మకృష్ణ.
వటపత్రశయకృష్ణ, వనజాక్షకృష్ణ.

౧౭. కుటిలనాశనకృష్ణ, కుబ్జేశకృష్ణ.
పాటలాధరకృష్ణ, భక్తేశకృష్ణ.

౧౮. కూటకాంబరకృష్ణ, యచ్యుతకృష్ణ.
పాతకోదరకృష్ణ, పరదేవకృష్ణ.

౧౯. పూతనాహారకృష్ణ,పుణ్యాత్మకృష్ణ.
చినిముద్దుకృష్ణ చిన్మయకృష్ణ.

౨౦. వెన్నదొంగవుకృష్ణ, వెన్నుడవుకృష్ణ.
ఫణిఫణాస్థితకృష్ణ, పద్మాక్షకృష్ణ.

౨౧. మణిమయాంచితకృష్ణ, మంజులకృష్ణ.
చాణూరహారకృష్ణ, చతురశ్రీకృష్ణ.

౨౨. వేణువాదకకృష్ణ, వేదాత్మకృష్ణ.
గోపికాపతికృష్ణ, గోపాలకృష్ణ.

౧౩. గోపవేషకకృష్ణ, గోవిందకృష్ణ
గరుడవాహనకృష్ణ, కల్యాణకృష్ణ.

౧౪. నరమృగాకృతికృష్ణ, నతపాలకృష్ణ.
సురసేవ్యశ్రీకృష్ణ, సుందరకృష్ణ.

౧౫. నరకసంహారకృష్ణ, నందజకృష్ణ.
పరమతారకకృష్ణ, పాలయకృష్ణ.

౧౬. పరమేశశ్రీకృష్ణ, పండరికృష్ణ.
కృష్ణహరిజయకృష్ణ, కృష్ణశ్రీకృష్ణ.

౧౭. కృష్ణకృష్ణయటంచు, కేవలభక్తి.

౧౦౮. నూటయెన్మిదిమార్లు, నోరూరమదిని,
పాటించిచదివిన, పాపముల్ బాయు,

నిన్నుసంస్తుతియింప, నేనెంతవాడ,
నన్నురక్షింపవే, నాపాలికృష్ణ.

ఇతి శ్రీ కృష్ణనామస్తవము
సంపూర్ణము.



